# మాథ్యూ హెన్రీ

## బోధకుడు మరియు వేదాంత పండితుడు




మాథ్యూ హెన్రీ బైబిల్ వ్యాఖ్యానము వ్రాసిన గ్రంథకర్త

www.Gospel Needs.com

# మాథ్యూ హెన్రీ

## 1662 - 1714

### బోధకుడు మరియు వేదాంత పండితుడు

మాథ్యూ హెన్రీ అనగానే క్రైస్తవులలో అనేకులకు అతడు వ్రాసిన బైబిలు వ్యాఖ్యానము గుర్తుకొస్తుంది. కారణం, అతడు వ్రాసిన బైబిలు వ్యాఖ్యానము ప్రపంచ ప్రసిద్ధిగాంచడమే. శతాబ్దాలుగా ఆ వ్యాఖ్యానము అనేకమంది క్రైస్తవులకు బైబిలు సత్యాలను గ్రహించేందుకు గొప్ప సహాయకారిగా పనిచేస్తోందన్నది వాస్తవం. ఆ వ్యాఖ్యానము వెనుక హెన్రీ చేసిన విరామములేని కృషి ఉందనేది కూడ వాస్తవమే.

కృపా గుర్తులు



www.gospel needs.com

మాథ్యూ హెన్రీ 1662వ సంవత్సరంలో ష్రాప్‌షైర్‌లోని వైట్‌చర్చికి దాదాపు మూడు మైళ్ళ దూరంలో ఉన్న బ్రాడ్ ఓక్ అనేచోట జన్మించాడు. అతడు ఫిలిప్ మరియు కేథరిన్ హెన్రీల రెండవ కుమారుడు. అతని తండ్రి వర్తన్‌బరీ ప్యారిష్‌లో ఒక అభిషేకము పొందిన మతాధికారిగా పనిచేసాడు. అయితే, లేఖనవిరుద్ధమైన చర్చి నియమ నిబంధనలకు ఇమడలేక అతడు 1662లో చర్చినుండి బయటకు వచ్చాడు.

మాథ్యూ హెన్రీ క్రైస్తవకుటుంబ క్రమశిక్షణలో పెంచబడ్డాడు. తన మూడవ ఏటనే అతడు బైబిలు గ్రంథాన్ని చదవడం ప్రారంభించాడు. దేవునివాక్య సత్యాలను



www.gospel needs.com

నేర్చుకోవాలన్న అతనిలోని లోతైన తృష్ణ అతణ్ణి లోతైన బైబిలు పఠనలోనికి నడిపించింది. హెన్రీ కుటుంబంలో ఉదయ సాయంకాలాలలో క్రమంగా ప్రార్ధనలు జరిగేవి. ఆ సమయాలలో అతని తండ్రి బైబిలు గ్రంథంలోని ఒక భాగాన్ని చదివి, దానిని కుటుంబసభ్యులకు విపులంగా వివరించేవాడు. ఆతర్వాత పిల్లలు తాము విన్న విషయాలను తమ స్వంత మాటలలో వ్రాసేందుకు ప్రోత్సహించ బడేవారు. ఈ ప్రక్రియ ఆతర్వాతికాలంలో మాథ్యూను ఒక గొప్ప వేదాంతపండితునిగా మార్చివేసింది. "విరిగిన మనస్సే దేవునికిష్టమైన బలులు. దేవా, విరిగి నలిగిన హృదయమును నీవు అలక్ష్యము చేయవు" (కీర్తన 51:17) అనే



www.gospel needs.com

అంశంపై అతని తండ్రి చేసిన చిన్ని ప్రసంగము మాథ్యూ మనస్సును విరిగిన మనస్సుగాను, అతని హృదయాన్ని విరిగి నలిగిన హృదయముగాను మార్చివేసింది, క్రీస్తును గురించి మరెక్కువగా తెలుసుకోవాలన్న తృష్ణను అతనిలో మరింతగా అధికంచేసింది.

ఆతర్వాతికాలంలో మాథ్యూ ఏకాంతంగా బైబిలు పఠించడంలో ప్రతిరోజూ గంటలతరబడి గడిపేవాడు. తనకు అనారోగ్యంగా ఉన్న సమయాలలో కూడ అతడు తన బైబిలు పఠనను కొనసాగించేవాడు. తన పదేళ్ళ వయసులో అతడు తీవ్రమైన అస్వస్థతకు గురైనప్పుడు తన ఆత్మీయ స్థితిని గురించి అతడు లోతుగా ఆలోచిస్తున్న



www.gospel needs.com

సమయంలో 1673 డిసెంబరు 7న 'దేవుని తీర్పు'ను గురించి అతడు విన్న ఒక సందేశము అతని హృదయాన్ని లోతుగా కదిలించివేసింది. ఆ సందర్భాన్ని గురించి అతడు ఇలా వ్రాసాడు: "ఆ సమయంలో నేను నరకాన్ని గురించి గొప్పగా భయపడ్డాను. ప్రభువు నన్ను ఓదార్చే వరకు ఆ భయం నాలో కొనసాగుతూవచ్చింది. 'నేను మరణిస్తే నేను ఎక్కడికెళతాను?' అన్న ప్రశ్న ఆ సమయంలో నన్ను తీవ్రంగా వేధించింది. ఆ సమయంలో నన్ను నేను లోతుగా పరీక్షించుకొన్నాను. నేను పాపినన్న వాస్తవాన్ని నేను గ్రహించాను. లోతైన పశ్చాత్తాపంతో నా పాపాలను ప్రభువు సన్నిధిలో ఒప్పుకొన్నాను. ప్రభువు నా



www.gospelneeds.com

పాపాలను క్షమించాడు. రక్షణ నిశ్చయతతోను, పరలోక నిరీక్షణతోను నేను నింపబడ్డాను. ఇప్పుడు నేను దేవునిబిడ్డనన్న నిరీక్షణ నాకు కలిగింది. ఇప్పుడు నేను మరణిస్తే, నేను పరలోకం వెళతానన్న నిశ్చయత నాకు కలిగింది.

## ఈ లోకపు వ్యర్థత

సంస్కరణ సమయంలో నాన్ కన్ఫర్మిస్టులను ఆక్స్‌ఫర్డ్ మరియు కేంబ్రిడ్జ యూనివర్సిటీలు వెలివేయడం వల్లను, ఆ సమయంలో యూనివర్సిటీలలో నెలకొనివుండిన అనైతిక జీవనవిధానాల వల్లను, 1680లో మాథ్యూ తండ్రి లండన్‌లోని ఐలింగ్టన్‌లో ఉన్న ఒక “డిసెంటింగ్



www.gospelneeds.com

అకాడమీ”లో చేరాడు. అయితే, అక్కడి ఆచార్యుడైన థామస్ డూలిటిల్ సామాజిక బహిష్కరణ కావించబడినందునను, అక్కడి పండితులు ఆయా ప్రాంతాలకు చెదరిపోయినందునను హెన్రీ తండ్రి అక్కడ కొద్దికాలం మాత్రమే కొనసాగాడు.

పై కారణాల ఫలితంగా మాథ్యూ తన చదువును అనేక సంవత్సరాలు తన ఇంట్లోనే కొనసాగించాడు. ఆతర్వాత అతడు 1685లో 'గ్రేస్ ఇన్' అనేచోట న్యాయశాస్త్రం చదివేందుకు లండన్‌కు వెళ్ళాడు. అయితే, ఆ చదువులో అతనికి ఏమాత్రం ఆసక్తి లేకపోవడంతో అతడు తీవ్రమైన అసంతృప్తికి గురై తన తండ్రికి ఇలా ఒక ఉత్తరం వ్రాసాడు: “ఈ లోక



www.gospelneeds.com

వ్యవహారాలను నేను లోతుగా గమనించినప్పుడు, అందులోని వ్యర్థతను నేను స్పష్టంగా చూసినప్పుడు, నా హృదయం వాటన్నిటినీ అమితంగా అసహ్యించుకొంటోంది. ఫలితంగా నా నేత్రాలు కనిపించని మరో ప్రపంచంపై తమ దృష్టిని కేంద్రీకరిస్తున్నాయి."

ఒక సంవత్సరం తర్వాత అతడు న్యాయశాస్త్ర చదువులకు స్వస్థిచెప్పి, బ్రాడ్ ఓక్‌కు తిరిగొచ్చాడు. అక్కడ అతనికి జార్జ్ ఇల్లిడ్జ్ అనే ఒక స్నేహితుడు పరిచయమయ్యాడు. ఆ స్నేహితుడు అతణ్ణి స్థానిక కూడికలలో బోధించమని ప్రోత్సహించాడు. ఇందులో మాథ్యూ కృతార్థుడు అయినందునను,



www.gospelneeds.com

సువార్తను ప్రకటించాలన్న అతనిలోని లోతైన ఆసక్తిని అనేకులు దృష్టించినందునను దేవునివాక్య సత్యాలను బోధించేందుకు చెస్టర్ మరియు నాన్ట్విచ్‌ల నుండి మాత్రమేగాక, ఇంకను అనేక ప్రాంతాలనుండి అతనికి ఆహ్వానాలు రావడం ప్రారంభించాయి. ఇది దేవుని చిత్తమేననీ, దేవుడు తన పనికొరకు తనను సిద్ధపరుస్తున్నాడనీ మాథ్యూ గ్రహించాడు. చివరిగా అతడు 1687 మే మాసంలో చెస్టర్‌లోని ఒక సంఘానికి సంఘకాపరిగా బాధ్యతలను చేపట్టాడు.

దేవునివాక్యం బోధించడంలో ప్రయాస పడుతూ ... చెస్టర్‌లో దేవునివాక్య సత్యాలను బోధిస్తూ మాథ్యూ ఇరవై ఐదు సంవత్సరాలు గడిపాడు.



www.gospelneeds.com

సంఘంలో జరిగే ఆదివారాల ఆరాధనలోను వారంలో జరిగే మరిరెండు వారకూడికలలోను బోధించడం మాత్రమేగాక, మిగతా రోజుల్లో ఇరుగుపొరుగు గ్రామాల్లోను చెస్టర్ కోటలోను కూడ మాథ్యూ దేవునివాక్యాన్ని బోధించేవాడు. ఆ సంవత్సరాలలో అతడు చేసిన నమ్మకమైన పరిచర్య ఆ ప్రాంతంలో ఐశ్వర్యవంతమైన ఆత్మీయ ఆశీర్వాదపు వర్షాలను కురిపించింది. ఫలితంగా దేవుడు అనేక ఇతర ప్రాంతాలలో మాథ్యూ పరిచర్యకు దేవుడు ద్వారాలను తెరిచాడు. రెక్స్‌హ్యామ్ మరియు బీస్టన్‌లలో నెలసరి కూడికలు నిర్వహించేందుకు మాత్రమేగాక, అనేక ఇతర పట్టణాలలోను లండన్ నగరంలోను కూడ దేవునివాక్యాన్ని



www.gospelneeds.com

బోధించేందుకు అతడు ఆహ్వానించబడ్డాడు. ఈలోగా అతడు కాపరిగా పనిచేస్తోన్న చెస్టర్‌లోని సంఘము గొప్పగా అభివృద్ధి చెందడంతో 1699లో సువిశాలమైన మరొక నూతన భవనము అక్కడ నిర్మించవలసిన అవసరత ఏర్పడింది.

ఇలా మాథ్యూ హెన్రీ తన పరిచర్యలో అవిరామంగా కొనసాగుతున్న సమయంలో అతని వ్యక్తిగత జీవితం గొప్ప విషాదానికి గురయింది. అతని వివాహం తర్వాత రెండు సంవత్సరాలకు అతని భార్య అయిన క్యాథరిన్ తన ప్రసవసమయంలో మరణించింది. ఆతర్వాత అతడు 1690లో మేరీ అనే స్త్రీని తిరిగి వివాహం చేసుకొన్నప్పటికీ, ఏడు



www.gospelneeds.com

సంవత్సరాల వ్యవధిలో వారు తమ ముగ్గురు బిడ్డలను కోల్పోయారు. ఈ శ్రమానుభవాల న్నిటిలో మాథ్యూ దేవుణ్ణి ఎక్కడా నిందించలేదు. ఎందుకంటే, "ప్రభువు నీతిమంతుడు, ఆయన ఇస్తాడు తిరిగి తీసుకొంటాడు" అని అతడు ఎరిగివున్నాడు కాబట్టి. అంతేకాదు, తన దుఃఖసమయాలు తన పరిచర్యకు ఆటంకం కలిగించేందుకు అతడు ఎన్నడూ అనుమతించలేదు. ఎందుకంటే, "విత్తువాని ఏడుపు అతడు పొలంలో విత్తడాన్ని ఆటంకపరచకూడదు'' అని అతడు విశ్వసించాడు కాబట్టి. కాబట్టి అతడు ప్రయాసతో కూడిన తన పరిచర్యా జీవితంలో సుదూర తీరాలకు పయనించాడు.



www.gospelneeds.com

1704వ సంవత్సరం చివర్లో మాథ్యూ నలభై రెండేళ్ళ వయసులో ఉన్నప్పుడు, తన గత పరిచర్యలో తాను బోధించేందుకు తయారుచేసుకొన్న తన వ్రాతప్రతులను అతడు బయటకు తీసాడు. వాటన్నిటితో అతడు బైబిలు వ్యాఖ్యానాన్ని వ్రాయడం ప్రారంభించాడు. తాను బాలుడుగా ఉన్నప్పుడే అతడు లాటిన్, హెబ్రీ, ఫ్రెంచ్ మొదలైన భాషలలో ప్రావీణ్యత సంపాదించాడు. బాల్యం నుండే అతడు దేవునివాక్యాన్ని క్షుణ్ణంగా పఠించివుండటం చేతను, తన సుదీర్ఘ పరిచర్యాకాలంలో అతడు



www.gospelneeds.com

దానిని విశేషంగా బోధించివుంటం చేతను, దేవుని ఆత్మ అతణ్ణి నడిపించడం చేతను అతడు ఆ బైబిలు వ్యాఖ్యానాన్ని విపులంగాను అందరికీ అర్థమయ్యే విధంగాను వ్రాయగలిగాడు. అలా అతడు ఆ వ్యాఖ్యానాన్ని వ్రాయడం ప్రారంభించి, పదేళ్ళ వ్యవధిలో పాతనిబంధనను మరియు క్రొత్తనిబంధన వ్యాఖ్యానాల వ్రాతపతులను పూర్తిచేసాడు.

ఇలా అతడు ఇరవై ఐదేళ్ళపాటు చెస్టర్‌లో పరిచర్యచేసిన తరువాత, 1712లో లండన్‌లోని హాక్నీలోవున్న ఒక డిసెంటర్ల సంఘములో పనిచేసేందుకు వచ్చిన



www.gospelneeds.com

ఆహ్వానాన్ని అతడు అంగీకరించాడు. అతడు చెస్టర్‌ను వదలి వెళ్ళడాన్ని ఎన్నడూ ఊహించలేదు, కాని లండన్‌కు వెళ్ళాలన్న దేవుని నడిపింపుకు అతడు విధేయతతో లోబడ్డాడు. లండన్‌లో అతని బోధలు అద్భుతమైన ఫలితాలనిచ్చాయి. మాథ్యూ అప్పుడప్పుడూ చెస్టర్‌కు వెళుతూ తన మునుపటి సంఘంలో కూడ బోధిస్తూవుండేవాడు. 1714లో చెస్టర్‌లోను నాన్ట్‌విచ్‌లోను బోధించేందుకు తానిచ్చిన వాగ్దానాన్ని నెరవేర్చే ప్రక్రియలో అతడు ఒకరోజు తీవ్రమైన అస్వస్థతకు గురయ్యాడు.



www.gospelneeds.com

మరుసటిరోజు అతడు లండన్‌కు తిరిగొస్తున్న సమయంలో టర్పోర్లీ వద్ద తాను పయనిస్తోన్న గుఱ్ఱంపైనుండి క్రిందపడ్డాడు. తర్వాత అతడు అక్కడకు సమీపంలో ఉన్న ఒక క్రైస్తవ పరిచారకుని వద్దకు కొనిపోబడి చికిత్స చేయబడ్డాడు కాని, మరుసటిరోజు అతడు తన తుదిశ్వాస విడిచాడు.

మాథ్యూ హెన్రీ తయారుచేసిన 'బైబిలు వ్యాఖ్యానము' యొక్క ప్రాముఖ్యతను తెలుసుకొన్న అతని సహపరిచారకులు అది ప్రపంచ క్రైస్తవులకు అందుబాటులోనికి వచ్చునట్లుగా దానిని ముద్రించేందుకు నడుము



www.gospelneeds.com

బిగించారు. అనతికాలంలోనే అది ముద్రణను పూర్తిచేసుకొని, ప్రపంచ క్రైస్తవలోకానికి అందుబాటులోనికి వచ్చింది. వైట్‌ఫీల్డ్ అనే భక్తుడు తన అనుదిన ధ్యానంలో భాగంగా మాథ్యూ హెన్రీ వ్యాఖ్యానాన్ని క్రమంగా చదివేవాడు. దానిని క్రమంగా చదివి గొప్ప ఆత్మీయమేలు పొందిన డాడ్రిడ్జ్ అనే భక్తుడు ఇలా వ్రాసాడు: "బైబిలు వ్యాఖ్యానాలు వ్రాసిన వ్యాఖ్యాతల్లో బహుశా మాథ్యూ హెన్రీ ఒక్కడే దేవునివాక్య సత్యాలను అత్యంత విపులంగాను అందరికీ అర్థమయ్యే విధంగాను వ్రాసాడేమోనని నాకు అనిపిస్తోంది.



www.gospelneeds.com

దేవునివాక్య సత్యాలను సవివరంగా తెలుసుకోవాలని ఆశించే ప్రతి క్రైస్తవవిశ్వాసి కూడ మాథ్యూ హెన్రీ వ్యాఖ్యానాన్ని తప్పక చదవాలి."

## శాస్త్ర - సాంకేతిక ఆశీర్వాదాలు

గుండుసూది మొదలుకొని రాకెట్ వరకు గల ఆవిష్కరణలను నూటికి 95 శాతం కనిపెట్టినవారు - బైబిల్ గ్రంథమును నమ్మిన వారే

యేసు ప్రభువు జన్మించి ఉండకపోతే - ప్రపంచము ఇప్పుడున్న అభివృద్ధి పథములోనికి వచ్చియుండకపోయేది.

కొన్ని ఆవిష్కరణలు, వాటిని కనిపెట్టిన క్రైస్తవ



www.gospelneeds.com

శాస్త్రవేత్తల వివరాలను ఇక్కడ పొందుపరుస్తున్నాము.

1. ప్రింటింగ్ ప్రెస్, జాన్‌గూటెన్‌బర్గ్ జర్మని 1455
2. గడియారము, బరోలోమ్యూన్‌మ్యాన్ ఇటలీ 1462
3. మైక్రోస్కోప్, జడ్.జాన్‌సన్ హాలెండ్ 1590
4. థర్మామీటర్, హన్స్ లిప్ధర్‌షే హాలెండ్ 1608
5. టెలీస్కోప్, గలీలియో గెలిలీ ఇటలీ 1993
6. క్లాక్ పెండ్యూలమ్, క్రిష్టియన్ హ్యూజన్స్ హాలెండ్ 1656
7. స్టీమ్ యింజన్, థామస్ సెవరి బ్రిటన్ 1698
8. మెషిన్ గన్, జేమ్స్ పుకుల్ బ్రిటన్ 1718
9. స్టీమ్ షిప్, జె.సి.పెరియర్ ఫ్రాన్స్ 1775
10. సబ్‌మెరైన్, డేవిడ్ బుష్‌నెల్ అమెరికా 1776
11. కంటి అద్దాలు, బెంజిమిన్ ఫ్రాంక్లిన్ అమెరికా 1780
12. మరమగ్గము, కార్ట్‌రైట్ బ్రిటన్ 1785
13. టెలిగ్రాఫ్, యమ్. లామండ్ ఫ్రాన్స్ 1787
14. పేరాచ్యూట్, ఎ.గార్నరిన్ ఫ్రాన్స్ 1797
15. బ్యాటరీ, అలెస్సాండ్రో ఓల్గా ఇటలీ 1800
16. టైప్‌రైటర్, పెల్లగ్రినేటర్రీ ఇటలీ 1808



www.gospelneeds.com

17. రైలుయింజన్, రిచర్డ్ ట్రివితిక్ బ్రిటన్ 1804

18. కంప్యూటర్, అలన్‌ట్యూరించ్ బ్రిటన్ 1824

19. అగ్గిపుల్ల, జాన్‌వాకర్ బ్రిటన్ 1824

20. కుట్టుమిషన్, బర్తెలెమి తిమ్మోనియర్ ఫ్రాన్స్ 1829

21. డైనమో, హైపొలైట్‌పిక్సీ ఫ్రాన్స్ 1832

22. గాల్వనో మీటర్, ఆంద్రీమేరి అంపియర్ ఫ్రాన్స్ 1832

23. ప్రొపెల్లర్ షిప్, ఫ్రాన్సిస్ స్మిత్ బ్రిటన్ 1837

24. సైకిల్, కిర్క్‌పాట్రిక్‌మాక్మిలన్ బ్రిటన్ 1839-40

25. రబ్బర్ టైర్, థామస్ హాంకాక్ బ్రిటన్ 1846

26. లిఫ్ట్, ఎలీషా ఓటీస్ అమెరికా 1852

27. సెల్యులాయిడ్, అలెగ్జాండర్ పార్క్స్ బ్రిటన్ 1861

28. ఎలక్ట్రిక్ మోటార్, జెనోబీ గ్రామ్ బెల్జియం 1873

29. మైక్రోఫోన్, అలగ్జాండర్ గ్రాహమ్‌బెల్ అమెరికా 1876

30. టెలిఫోన్, అలగ్జాండర్ గ్రాహమ్‌బెల్ అమెరికా 1876

31. కార్బొరేటర్, గాట్‌లిబ్‌డెయిమ్‌లెర్ జర్మనీ 1876

32. గ్రామ్‌ఫోన్, థామస్ ఆల్వాఎడిసన్ అమెరికా 1878

33. ఎలక్రిక్‌బల్బు, థామస్ ఆల్వాఎడిసన్ అమెరికా 1879



www.gospelneeds.com

34. ఇస్త్రీపెట్టె, సిలే అమెరికా 1882

35. మోటర్ సైకిల్, డైమ్లర్ ఆఫ్ కాన్‌స్టాట్ జర్మనీ 1885

36. బాల్‌పాయింట్‌పెన్ను, జోన్‌టేడ్ అమెరికా 1888

37. పెట్రోల్ కార్, కార్ల్‌బెంజ్ జర్మనీ 1888

38. ఎలక్ట్రిక్ మోటార్, నికోలాటెస్‌లా అమెరికా 1888

39. సేఫ్టీరేజర్, కింగ్ సి.గిల్లెట్ జర్మనీ 1895

40. డీసెల్ యింజన్, రోడాల్ డీసెల్ జర్మనీ 1895

41. ఎక్స్-రే, రాంట్‌జెన్ జర్మనీ 1895

42. లౌడ్‌స్పీకర్, హొరేస్‌షార్ట్ బ్రిటన్ 1900

43. విమానము, రైట్‌సోదరులు బ్రిటన్ 1900

44. స్టెయిన్‌లెస్ స్టీల్, హరీబ్రియర్‌లీ బ్రిటన్ 1913

45. రాడార్, టేలర్&లియో సి.యంగ్ అమెరికా 1922

46. హెలీకాప్టర్, ఎటిన్నీఓమిషన్ ఫ్రాన్స్ 1924

47. టెలివిజన్, పి.టి.ఫ్రాన్స్‌వర్త్ అమెరికా 1927

48. రబ్బర్‌ఫోమ్, డన్‌లప్‌రబ్బర్ కంపెనీ బ్రిటన్ 1928

49. జెట్‌విమానం, సర్‌ఫ్రాంక్‌విట్టిల్ బ్రిటన్ 1937

50. లేసర్‌కిరణాలు, టి.హెచ్.మైమా అమెరికా 1960



www.gospelneeds.com

51. క్యాష్ రిజిస్టర్, జేమ్స్‌రిట్టీ అమెరికా 1879

52. సెల్లోఫోనేన్, డా.జె.బ్రాండెన్ బర్గర్ స్విట్జర్లాండ్ 1908

53. పోర్ట్‌లాండ్ సిమ్మెంట్, జోసఫ్ ఆస్పిడిన్ బ్రిటన్ 1924

54. సినిమా, నికోలస్&జిన్ టూమియర్ ఫ్రాన్స్ 1895

55. డెంటల్‌ప్లేట్, ఆంథోనీ ఎ.ప్లాన్‌స్టన్ అమెరికా 1817

56. ఫిల్మ్(మూవింగ్ అవుట్‌లైన్స్), టూయిస్‌ప్రిన్స్‌ఫ్రాన్స్ 1885

57. ఫౌంటెన్ పెన్, లూయిస్ ఇ వాటర్‌మేన్ అమెరికా 1923

58. గ్యాస్‌లైటింగ్, విలియం మర్డక్ బ్రిటన్ 1792

59. గ్లైడర్, సర్‌జార్జ్ కేలీ బ్రిటన్ 1853

60. గైరోకంపాస్, ఎల్మర్ ఎ స్పెర్రీ అమెరికా 1911

61. హోవర్‌క్రాఫ్ట్, సి.యస్.కాక్‌రెల్ బ్రిటన్ 1955

62. లాడ్‌రేట్, జె.ఎఫ్.కాన్‌ట్రెల్ అమెరికా 1934

63. లూమ్‌పవర్, ఇ.కార్ట్‌రైట్ బ్రిటన్ 1785

64. మైక్రోప్రాసెసర్, రాబర్ట్‌నోయ్స్&గోర్డన్‌మూర్ అమెరికా 1971

65. నియోన్‌ల్యాంప్, జార్జెస్‌క్లాడ్ ఫ్రాన్స్ 1910

66. నైలాన్, డా.వేలెస్ హెచ్ కేరోథేర్స్ అమెరికా 1937

67. పాశ్చరైజేషన్, లూయీస్ పాశ్చర్ ఫ్రాన్స్ 1867



www.gospelneeds.com

68. ఫోటోగ్రఫీ, జాన్‌కార్బట్ అమెరికా 1888

69. పార్సిలీన్, సర్‌ప్యాడిక్ చైనా 1851

70. రేయాన్, సర్‌జోసఫ్ స్వేన్ బ్రిటన్ 1883

71. రిఫ్రిజిరేటర్, జేమ్స్‌హరిసన్, అమెరికా 1850

72. రబ్బర్(వల్కనైజ్‌డ్), ఛార్లెస్ గుడ్ ఇయర్ అమెరికా 1841

73. రూబిక్‌క్యూబ్, ప్రొ.ఎమోర్యూబిక్ హంగేరి 1975

74. సెల్ఫ్‌స్టార్టర్, ఛార్లెస్ ఎఫ్.కెటెరింగ్ అమెరికా 1911

75. షిప్‌టర్బైన్, హన్‌సర్ సి.పార్సన్స్ బ్రిటన్ 1894

76. స్కై స్క్రేపర్, బేరన్ జెన్నీ అమెరికా 1882

77. స్లైడ్‌రూల్, విలియం ఆట్రెడ్ బ్రిటన్ 1621

78. ట్యాంకర్(యుద్ధ), సర్‌ఎర్నస్ట్ స్వింగ్‌టన్ బ్రిటన్ 1914

79. టెలిగ్రాఫ్‌కోడ్, సామ్యూల్ ఎఫ్‌బి.మోర్స్ అమెరికా 1837

80. ట్రాన్స్‌ఫార్మర్, మైఖేల్ ఫారడే బ్రిటన్ 1831

81. ట్రాన్సిస్టర్, బర్డీన్ షాక్‌లే& బ్రట్టైన్ అమెరికా 1948

82. వాటర్‌క్లోసెట్, జె.హర్రింగ్‌టన్ బ్రిటన్ 1589

83. ఎలక్ట్రిక్ వెల్డింగ్, ఎలీషా థామస్ అమెరికా 1877

84. వీల్, సుమేరియన్ సివిలైజేషన్ క్రీ.పూ.3300



www.gospelneeds.com

85. జిప్‌ఫాస్ట్‌నెర్, డబ్ల్యు.ఎల్.జడ్సన్ అమెరికా 1891

86. సేఫ్టీపిన్, వాల్టర్ హంట్ అమెరికా 1849

87. దొంగనుపట్టే అలారం, ఎడ్విన్‌హంట్ అమెరికా 1858

88. విండ్‌మిల్, పెర్షియన్ కార్న్ గ్రైండింగ్ క్రీ.పూ.600

89. రిమోట్, రాబర్ట్ ఆడ్లర్ అమెరికా 1956

90. బెలూన్, జాక్వెస్జ్‌జోసఫ్ మాంట్‌గోలర్ ఫ్రాన్స్ 1783

91. బున్‌సెన్‌బర్నర్, ఆర్.విల్‌హెల్మ్ ఓన్‌బున్‌సెన్ జర్మనీ 1855

92. టర్బీన్, జెఆర్‌వింగ్‌ఫీల్డ్&ఎటి డిక్‌సన్ బ్రిటన్ 1931

యేసు ప్రభువు నేను లోకమునకు వెలుగైయున్నానని చెప్పారు. భక్తిసంబంధమైన వెలుగే గాక, జ్ఞానసంబంధమైన వెలుగును కూడా మానవులకు ప్రసాదించారు. ఆయనను ప్రార్థించేవారిపై ఈ జ్ఞానజ్యోతిని ఉదయింపజేసినందున - వారు ఇన్ని ఆవిష్కరణలు కనుగొనగలిగారు. ✡✡✡✡



www.gospelneeds.com

# విలువైన ప్రార్థన

బహు అందమైన పటం ఒకటి గోడకు తగిలించబడి వుంది. అక్కడకు ఒక యువకుడు వచ్చి ఆ పటమును చూచి ముందుకు అడుగువేయలేకపోతున్నాడు. ఆ పటము అతని తల్లిది. అతని మనస్సులో ఎన్నో తలంపులు, ఊహలు పలు రకాలుగా మెదులుచున్నవి. గణితమును గురించి, వ్యాకరణము గురించి. మంచి సంగీతమును గురించి మరియు ఆటలు గురించి తన మనస్సులో తలంచుచున్నాడు. ఇవే ఒక గొప్ప వ్యక్తి గురించి తలంచుచూ, భవిష్యత్తును మిక్కిలి



www.gospelneeds.com

ప్రభావితమైనదిగా చేసుకోవాలని సంకల్పిస్తున్నాడు. ఆయన ఎవరో తెలుసా? ఆయన పేరు వాషింగ్‌టన్ దేశములో అతడే గొప్ప ధనికుడు. హంగు ఆర్భాటాలతో తుల తూగుతూ ఉండేవాడు. ఆయినను అతడు మౌనముగా ఉండుటకే ప్రాధాన్యం ఇచ్చేవాడు. అతని గృహం మంచి ఉన్నతమైన స్థలములో కట్టబడి ఆకర్షనీయంగా వుంది.

అతడు అప్పుడు యవనుడు. ఒక రోజున తన తల్లి కాళ్ళదగ్గర మోకరించి "అమ్మా నేను మన గృహాన్ని విడిచి, నిన్ను విడిచి మన దేశం కొరకు పోరాడుటకు



www.gospelneeds.com

సైన్యములోకి వెళ్ళిపోవుచున్నాను. నా కొరకు ప్రార్థించు. నేను బహుసుదూర ప్రయాణం చేసి. దేశ స్వతంత్ర్యమునే సంపాదించు పనిలోకి వెళ్ళుచున్నాను" అని వేడుకొన్నాడు. అతడు మోకాళ్ళ మీద వుండి చేసిన మనవిని తన తల్లి విని తన కుమారుని యొుక్క దీనమైన కోరిక ప్రకారము ప్రార్థన చేసి పంపించినది. వాషింగ్‌స్టన్ సమస్తమును విడిచిపెట్టి కష్టతరమైన పనికొరకు తనను, తాను సిద్ధం చేసుకొని బయలుదేరినాడు. అక్కడ తనకు సంభవించబోవు కష్టములు, ఆందోళన, భారము, అవమానము ఆకలిదప్పులు



www.gospelneeds.com

ఇవన్నీ తన మనస్సులో ఉండినప్పటికిని ముందుకు దూసుకుపోయాడు.

చాల కాలం తరువాత ఇలాగు రాసుకున్నాడు. వ్యవసాయం చేసుకొనే స్థితినుండి గుర్రములను స్వారీ చేసుకొనే పని నుండి పంటలు పండించే వృత్తినుండి సిపాయి ఉద్యోగం నుండి నేను పైకెత్తబడితిని. నా గృహాన్ని మౌంట్‌వేర్‌నోన్‌పై నిర్మించుకోగల్గితిని. నా తల్లి ప్రార్థన నాకెంతో మేలు చేసింది. (1యోహాను 5:14)





www.gospelneeds.com

